# సుమతిశతకము.

(Selections)

By

విద్వాన్ వడ్లమూడి వేంకటరత్నంగారు.



ప్రచురణ:

తెనాలి తాలూకాబోర్డు ఉపాధ్యాయ సంఘము.

లలిత ముద్రాక్షరశాల, తెనాలి.

1930



[వెల రు 0-1-6

# సుమతిశతకము.

(Selections)

By

విద్వాన్ వడ్లమూడి వెంకటరత్నంగారు.



పబ్లిషర్సు

తాలూకాబోర్డు ఉపాధ్యాయ సంఘము,

తెనాలి.



[వెల రు: 0-1-6.

1930

లలిత ముద్రాక్షరశాల, తెనాలి.

# పీఠిక.

---

సుమతిశతకము సర్వజనాదరణీయమైనది. శైలి కడు సులభము. పద్యములు చక్కని నీతుల చాటుచున్నవి. బాల్యమునం దలవడిన నీతి మానవుని సన్మార్గ ప్రవర్తనునిగ జేయును గాన యిట్టి శతకములను ఆరంభ తరగతుల నుండియే ప్రాథమిక పాఠశాలలందు చదివించుట, చాల ఉత్తమము.

అనేకులు యీశతకమును ప్రకటించి యుండిరి. కాని చిన్న అచ్చులో ఉండుటచే పసికూనలు చదువుటకు కష్టముగ నున్నది. ప్రాథమిక విద్యాభివృద్ధియే ముఖ్యోద్దేశముగల మా సంఘమువారు యీ లోటును దీర్చుటకు గాను అనుకూలమైన పద్యములతో సంగ్రహించిన యీశతకమును పెద్ద అక్షరములలో ప్రకటించుచున్నారము.

ఇట్లు

తూములూరు రామమూర్తి,

అధ్యక్షుడు.

తెనాలి తాలూకాబోర్డు ఉపాధ్యాయ సంఘము.

శ్రీ ర స్తు.

# సు మ తి శ త క ము.

## ప ద్య ము లు

శ్రీరాముని దయచేతను
నారూఢిగ సకలజనులు నౌరాయనఁగా
ధారాళమైననీతులు
నోరూరఁగఁ జవులు పుట్ట నుడివెద సుమతీ

అక్కఱకు రానిచుట్టము (దా
మ్రొక్కిన వర మీనివేల్పు మోహరమునఁ
నెక్కినఁ బాఱని గుఱ్ఱము (మతీ
గ్రక్కున విడువంగ వలయుఁ గదరా సు

అడిగిన జీతంబియ్యని (న్
మిడిమేలపుదొరను గొల్చిమిడుకుటకంటె
వడిగల యెద్దులఁ గట్టుక (మతీ
మడిదున్నుక బ్రతుకవచ్చు మహిలో సు

అడియాస కొలువుఁ గొలువకు (తోడన్
గుడిమణియము సేయఁ బోకు కుజనుల
విడువక కూరిమి సేయకు (మతీ
మడవిని దో డరయ కొంటి యరుగకు సు

అధరము గదలియుఁ గదలక 5
మధురములగు భాషలుడిగి మౌనవ్రతుడౌ
నధికార రోగపూరిత (మతీ
బధిరాంధక శవముఁజూడఁ బాపము . సు

అప్పుగొని చేయువిభవము (ము
ముప్పున బ్రాయంపుటాలు మూర్ఖునితప
దప్పరయని నృపురాజ్యము
దెప్పరమై మీఁదఁ గీడు దెచ్చుర సుమతీ

అప్పిచ్చువాఁడు వైద్యుఁడు (డుం
నెప్పుడు నెడతెగకపాఱు నేఱును ద్విజుఁ
జొప్పడిన యూరనుండుము (తీ
చొప్పడ కున్నట్టియూరు సొరకుము సుమ

ఇచ్చునదె విద్య రణమునఁ
జొచ్చునదే మగతనంబు సుకవీశ్వరులున్
మెచ్చునదె నేర్పు వాదుకు
వచ్చునదే కీడు సుమ్ము వసుధను సుమతీ

ఇమ్ముగఁ జదువనినోరును 9
నమ్మాయనిపిలిచియన్న మడుగనినోరుం
దమ్ములఁ బిలువనినోరును
గుమ్మరిమను ద్రవ్వినట్టి గుంటర సుమతీ

ఉడు ముండదె నూఱేండ్లును (డ్లున్
బడియుండదె పేర్మిఁ బాము పదినూఱేం
మడువునఁ గొక్కెర యుండదె (త్రి
కడునిలఁ బురుషార్థపరుఁడు గావలె సుమ

ఉత్తమ గుణములు నీచున (ప్రా
కెత్తెఱఁగునఁ గలుగనేర్చు నెయ్యెడలం
నెత్తిచ్చి కరఁగి పోసిన
నిత్తడి బంగార మగునె యిలలో సుమతీ

ఉదకము ద్రావెడు హయమును 12
మదమున నుప్పొంగుచుండు మత్తేభంబున్
మొదవుకడ నున్న వృషభముఁ
జదువని యానీచుకడకుఁ జనకుర సుమతీ

ఉపకారికి నుపకారము 13
విపరీతము గాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెప మెన్నక చేయువాఁడు నేర్పరి సుమతీ

ఎప్పటి కెయ్యది ప్రస్తుత (ల
మప్పటి కామాటలాడి యన్యుల మనము
నొప్పింపక తా నొవ్వక
తప్పించుక తిరుగువాఁడు ధన్యుడు సుమతీ

ఎప్పుడుఁ దప్పులు వెదకెడు (న
నప్పురుషుని గొల్వఁ గూడ దదియెట్లన్న
సర్పంబు పడగనీడను
గప్ప వసించినవిధంబు గదరా సుమతీ

ఎప్పుడు సంపద గలుగును 16
నప్పుడ బంధువులు వత్తు రది యెట్లన్నఁ
దెప్పలుగఁ జెఱువు నిండినఁ
గప్పలు పది వేలు చేరుఁ గదరా సుమతీ

ఏఱకుమీ కసుగాయలు 17
దూఱకుమీ బంధుజనుల దోషము సుమ్మీ
పాఱకుమీ రణమందున
మీఱకుమీ గురువు నాజ్ఞ మేదిని సుమతీ.

ఓడల బండ్లును వచ్చును 18
ఓడలు నాబండ్లమీఁద నొప్పుగ వచ్చున్
ఓడలు బండ్లును వలెనే
వాడంబడుఁ గలిమిలేమి వసుధను సుమతీ

కనకపు సింహాసనమున (నం
శునకముఁ గూర్చుండఁ బెట్టి శుభలగ్నము
దొనరఁగఁ బట్టము గట్టిన
వెనుకటి గుణ మేలమాను వినురా సుమతీ

కమలములు నీటఁ బాసిన 2(
గమలాప్తుని రశ్మిసోఁకి కమలినభంగిం
దమతమ నెలవులు దప్పినఁ
దమమిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ

కరణముల ననుసరింపక 21
విరసంబునఁ దిన్నతిండి వికటించుఁ జుమీ
యిరుసునఁ గందెనఁ బెట్టక
పరమేశ్వరు బండియైనఁ బాఱదు సుమతీ

కారణము లేనినగవును 22
బేరణమును లేనిలేమ పృథివీస్థలిలోఁ
బూరణము లేనిబూరెయు
వీరణములు లేనిపెండ్లి వృథరా సుమతీ

కులకాంత తోడ నెప్పుడుఁ 23
గలహింపకు వట్టితప్పు ఘటియింపకుమీ
కలకంఠికంటఁ గన్నీ
రొలికిన సిరి యింట నుండ నొల్లదు సుమ (తీ

కూరిమి గలదినములలో (యా
నేరము లెన్నఁడును గలుగ నేరవు మఱి
కూరిమి విరసంబైనను (తీ
నేరములే తోఁచుచుండు నిక్కము సుమ

కొఱగాని కొడుకు పుట్టినఁ (ఱుచుం
గొఱగామియె కాదు తండ్రి గుణములఁ జె
జెఱకుతుద వెన్ను పుట్టినఁ (తీ
జెఱకునఁ దీపెల్లఁ జెఱచు సిద్ధము సుమ

చీమలు పెట్టిన పుట్టలు 26
పాముల కిరవైనయట్లు పామరుఁడుదగన్
హేమంబుఁ గూడఁబెట్టిన
భూమీశుల పాలఁ జేరు భువిలో సుమతీ

చుట్టములు గానివారలుఁ 27
జుట్టములము నీకటంచు సొంపు దలిర్పన్
నెట్టుకొని యాశ్రయింతురు
గట్టిగ ద్రవ్యంబు గలుగఁ గదరా సుమతీ

చేతులకు దొడవుఁ దానము 28
భూతలనాథులకుఁ దొడవుబొంకమిధరలో
నీతియె తొడ వెవ్వారికి
నాతికి మానంబు తొడవు నయముగసుమ

తనకోపమె తనశత్రువు
తనశాంతమె తనకు రక్ష దయచుట్టంబౌఁ
దనసంతోషమె స్వర్గము
తనదుఃఖమె నరక మండ్రు తథ్యము సుమ

తనవారు లేనిచోటను 29
జన వించుక లేనిచోట జగడముచోటన్
అనుమాన మైనచోటను (మతీ
మనుజునకును నిలువఁదగదు మహిలో సు

తలనుండు విషము ఫణికిని (కం
వెలయంగాఁ దోఁక నుండు వృశ్చికమున
దలదోఁక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ

దగ్గఱఁ గొండెము సెప్పెడు (జితా
ప్రెగ్గడ పలుకులకు రాజు ప్రియుఁడై మ
నెగ్గు ప్రజ కాచరించుట
బొగ్గులకై కల్పతరువుఁ బొడుచుట సుమతీ

ధీరులకుఁ జేయుమేలది 32
సారంబగు నారికేళ సలిలముభంగిన్
గౌరవమున మఱి మీఁదట
భూరిసుఖావహము నగును భువిలో సుమతీ

నడువకుమీ తెరువొక్కటఁ 33
గుడువకుమీ శత్రునింటఁ గూరిమితోడన్
ముడువకుమీ పరధనముల
నుడువకుమీ యొరులమనసు నొవ్వఁగ సుమతీ

నయమునఁ బాలుం ద్రావరు 34
భయమునను విషమునైన భక్షింతురుగా
నయమెంత దోసకారియొ
భయమే చూపంగవలయు బాగుగ సుమతీ

నరపతులు మేర దప్పినఁ 35
దిర మొప్పఁగ విధవయింటఁ దీర్పరియైనం
గరణము వైదికుఁ డైనను
మరణాంతక మౌనుగాని మానదు సుమతీ

నవరసభావాలంకృత 36
కవితాగోష్ఠియును మధుర గానంబును దా
నవివేకి కెంత చెప్పినఁ
జెవిటికి సంకూఁదినట్లు సిద్ధము సుమతీ

నవ్వకుమీ సభలోపల 37
నవ్వకుమీ తల్లిదండ్రి నాథులతోడన్
నవ్వకుమీ పరసతితో
నవ్వకుమీ విప్రవరుల నయ మగు సుమతీ

పతికడకుఁ దన్నుఁ గూర్చిన 38
సతికడకును వేల్పుకడకు సద్గురుకడకున్
సుతుకడకు రిత్తచేతుల
మతిమంతులు చనరు నీతిమార్గము సుమతీ

పరసతి కూటమి గోరకు 39
పరధనముల కాసపడకు పరు నెంచకుమీ
సరిగాని గోష్ఠి సేయకు
సిరి చెడి చుట్టంబుకడకుఁ జేరకు సుమతీ

పాలను గలసిన జలమును 40
బాలవిధంబుననె యుండుఁ బరికింపంగాఁ
బాలచవిఁ జెఱచుఁ గావునఁ
బాలసుఁడగు వానిపొందు వలదుర సుమతీ

పురికిని బ్రాణము గోమటి 42
వరికిని బ్రాణంబు నీరు వసుమతిలోనం
గరికిని బ్రాణము తొండము
సిరికిని బ్రాణంబు మగువ సిద్ధము సుమతీ

పెట్టిన దినములలోపల 43
నట్టడవుల కైనవచ్చు నానార్థములుం
బెట్టని దినముల గనకపు
గట్టెక్కిన నేమిలేదు గదరా సుమతీ

పొరుగునఁ బగవాఁ డుండిన 44
నిరవొందఁగ వ్రాఁతకాఁడె యేలికయైనన్
ధరఁ గాఁపు కొండెమైనను
గరణాలకు బ్రతుకులేదు గదరా సుమతీ

బంగారు కుదువఁ బెట్టకు 45
సంగరమునఁ బాఱిపోకు సరసుఁడ వైతే
నంగడి వెచ్చము లాడకు
వెంగలితోఁ జెలిమి వలదు వినురా సుమతీ

బలవంతుఁడ నా కేమని 46
పలువురతో నిగ్రహించి పలుకుట మేలా
బలవంత మైనసర్పము
చలిచీమల చేతజిక్కి చావదె సుమతీ

మంత్రిగల వానిరాజ్యము (ధరలో
తంత్రము సెడకుండ నిలుచుఁ దఱుచుగ
మంత్రి విహీనుని రాజ్యము
జంత్రపుఁ గీలూడినట్లు జరుగదు సుమతీ

మాటకుఁ బ్రాణము సత్యము 48
కోటకుఁ బ్రాణంబు సుభట కోటి ధరిత్రిన్
బోటికిఁ బ్రాణము మానము
చీటికిఁ బ్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ

రూపించి పలికి బొంకకు 49
ప్రాపగుచుట్టంబు నెగ్గు పలుకకు మదిలోఁ
గోపించు రాజుఁ గొల్వకు
పాపపుదేశంబు సొరకు పదిలము సుమతీ

లావు గలవాని కంటెను 50
భావింపఁగ నీతిపరుఁడు బలవంతుం డౌ
గ్రావంబంతగజంబును
మావటివాఁ డెక్కినట్లు మహిలో సుమతీ

వఱదైనచేను దున్నకు 51
కఱవైనను బంధుజనుల కడ కేఁగకుమీ
పరులకు మర్మము సెప్పకు
పిఱికికి దళవాయితనము పెట్టకు సుమతీ

వరిపంట లేనియూరును (రువు౹౹
దొర యుండనియూరు తోడు దొరకనితె
ధర నృపతి లేనిగృహమును (త్రీ
నరయంగా రుద్రభూమి యనఁ దగుసుమ

వినఁ దగు నెవ్వరు సెప్పిన 53
వినినంతనె వేగపడక వివరింపఁ దగున్
గని కల్ల నిజముఁ దెలిసిన (తీ
మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమ

శుభముల నొందని చదువును 54
నభినయముగ రాగరసము నందనిపాటల్
గుభ గుభలు లేనికూటమి
సభ మెచ్చనిమాట లెల్లఁ జప్పన సుమతీ

సరసము విరసముకొఱకే 55
పరిపూర్ణసుఖంబు లధిక బాధలకొఱకే
పెరుఁగుట విఱుగుటకొరకే
ధర తగ్గుట హెచ్చుకొఱకె తథ్యము సుమ (తీ

మే లెంచని మాలిన్యుని 56
మాలను నగసాలెవాని మంగలి హితుఁగా
నేలిన నరపతిరాజ్యము
నేలఁ గలసి పోవుఁ గాని నెగడదు సుమతీ

స్త్రీలయెడ వాదులాడకు 57
బాలురతోఁ జెలిమి చేసి భాషింపకుమీ
మేలైనగుణము విడువకు
మేలినపతి నిందసేయ కెన్నఁడు సుమతీ

సిరి దా వచ్చిన వచ్చును 58
సలలితముగ నారికేళ సలిలముభంగిన్
సిరి దాఁ బోయినఁ బోవును
గరి మ్రింగిన వెలఁగపండు కరణిని సుమతీ

పుత్రోత్సాహము తండ్రికిఁ 59
బుత్రుఁడు జన్మించినపుడె పుట్టదు జనులా
పుత్రునిఁ గనుగొని పొగడఁగఁ
బుత్రోత్సాహంబునాఁడు పొందుర సుమతీ

